శ్రీరస్తు

# గృహే వాయసాది ప్రవేశశాన్తిః*

గృహమునందు-గుడ్లగూబ గాని, పావురముగాని, సర్పముగాని ప్రవేశించినను, కాకి ఏడుదినములు నివసించినను, తేనె తుట్టెలు పట్టినను, ఆవరణలో మొండిచెయ్యి మొలచినను. ఇంటిపై గ్రద్ద వ్రాలినను, గృహయజమానికి, కుటుంబమునకు అశుభ సూచకము. కావున ముందుగ వానిని గృహమునుండి తొలగించి. గృహమును పరిశుద్ధము చేసి, పంచ గవ్యముగాని. లేక ఆవు పంచితముగాని లేక పసుపునీళ్ళుగాని గృహమంతటను జల్లవలెను.



తరువాత దంపతులు శిరస్స్నానము చేసి, శుభ్రవస్త్రములను, తిలకమును ధరించి, ఇనుప పాత్రయందు నువ్వులనూనెతో దీపారాధనచేసి 'ఇంద్రాయ నమః యమాయనమః మృత్యుంజయాయ నమః' అని నమస్కరించవలెను.

తరువాత యజమాని నెలలోపల వాస్తుశాన్తిని చేయించవలెను. ఈకల్పము ననుసరించి వాస్తుశాన్తిని చేయించినచో - గణపతి పూజ, పుణ్యాహ వాచనము, శిఖ్యాది దేవతావాహన, నవగ్రహ, దిక్పాలకా వాహన చేసి, షోడశోపచార పూజలు మాత్రము చేయవలెను.

తరువాత ఇంతకుముందు దీపారాధన చేసిన ఇనుప పాత్రలోనెయ్యి గాని, నువ్వులనూనెగాని పోసి, అందు దంపతులు తమముఖములనుచూచు కొని, ఆ పాత్రను నూనెతోసహా బ్రాహ్మణునకు దానముచేసి,దక్షిణతాంబూలాదులనిచ్చి, ఆశీర్వచనము పొందవలెను.

పిమ్మట దంపతులు కాళ్ళు కడిగికొని అద్దముతో ముఖము చూచు కొనవలెను. ఇట్లు చేసిన సర్వారిష్ట నివృత్తి కలిగి, ఆయురారోగ్యైశ్వర్యాదులు కలుగును.

ఇతి వాయసాది ప్రవేశాది శాన్తి విధానమ్.

---

## గ్రామ్యారణ్య మృగపక్షులకు వికారమందు శాంతి

గృహమందు కపోతమనఁగ పారువము ప్రవేశించినను తేనెపుట్ట బెట్టినను
పింగలయను పక్షియొక్క స్వరము కాకివికారము గ్రామములోనివిగాని యరణ్యములో
నివిగాని యగు మృగపక్షులకు వికారము గలిగెనేనియు శాంతి యెట్లనిన; దేవాః
కపోత యను సూక్తముచే వేయుగాని నూరుగాని వ్రేల్చి "యతఇంద్రభయామహే
స్వస్తిదాః త్ర్యంబక మను మంత్రములచే వ్రేల్చి వ్యాహృతులచే నూటయెన్మిది తిలాహు
తులు వ్రేల్చవలెను. లేదా యైదుగురు బ్రాహ్మణులచే 'దేవాః కపోత' యను సూక్త
మును 'సుదేవో అసి' యను ఋక్కును 'కనిక్రద' త్తను శాకుంతసూక్తమును 'నమో
బ్రహ్మణే నమో' యను మంత్రమును సహస్రాది సంఖ్యచే జపింపఁజేసి యుపనిష
త్తుల బఠింపఁజేసి వ్యాహృతులచే దిలహోమము జేయునది.